**శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారి శత జయంతి ఉత్సవ సమీక్ష**

''రాయికైనా ఆయన పాఠం చెబితే రావాల్సిందే –రాకపోవటం అనేది లేదు ''అని ప్రసిద్ధి పొందిన వారు మహా మహోపాధ్యాయ శ్రీ మద్దుల పల్లి మాణిక్య శాస్త్రి గారు .కంచి పరమాచార్యులకు అత్యంత సన్నిహితులు . ద్వైత అద్వైత విశిష్టాద్వైతు లందరికీ ఆదర్శ గురు మూర్తి .వారింటి లోనే ఉండి చదువుకొన్నవారెందరో శిష్యులున్నారు .వారి శిష్యపరంపర అగణితం .అందరూ వివిధ శాస్త్రాలలో అమోఘ పాండిత్యం ఆ గురు మూర్తి వలన పొంది లబ్ధ ప్రతిష్టులై,అత్యున్నత పదవులలో రాణిస్తున్నారు .ఆయన జీవితకాలం లోనే శిష్యులందరూ కూడి ఫాల్గుణ బహుళ పాడ్యమి శాస్త్రి గారి జన్మ దినం రోజు ,శాస్త్రార్ధ చర్చలు ,పండిత పురస్కారాలు చేస్తూ చక్కని పరంపరను సృష్టించారు .ఇప్పుడు శ్రీ మాణిక్య శాస్త్రి గారి శత జయంతి ఉత్సవాలను దేశం లోని అనేక రాష్ట్రాలలో ,రాష్ట్రం లోని వివిధ ప్రాంతాలలో ఉన్న శిష్య బృందం అందరూ కలిసి ఘనం గా 11-3-17 నుండి 13 -3-17 వారి జన్మ దినం ఫాల్గుణ బహుళ పాడ్యమి వరకు మూడు రోజుల పాటు ఘనంగా విజయవాడలోని శివ రామ కృష్ణ క్షేత్రం లో అంటే మాణిక్య శాస్త్రి గారు 30 సంవత్సరాలు ఏకధాటిగా సకల పురాణ ప్రవచనం చేసిన కార్య క్షేత్రం లో నిర్వహించారు .

11-3-17 –శనివారం మొదటి రోజు ఉదయం గో పూజ ,గురుపూజ నిర్వహించి, అంతకు ముందు రెండు రోజులుగా నిర్వహించిన హోమానికి పూర్ణా హుతి జరిపారు .ఉదయం 9 గం లకు సభ ప్రారంభమైనది .ఉదయం 10-45 వరకు ''తైత్తిరీయ ఉపనిషత్ ''బాష్య ప్రవచనం ,అద్వైత సిద్ధిలో ''అనుమాన బాదోద్ధార ''విచారం శాస్త్ర చర్చ జరిగింది .ఉదయం 11 గం లకు మాణిక్య శాస్త్రిగారి ముఖ్య శిష్యులు ,ప్రస్తుత బెనారస్ హిందూ విశ్వ విద్యాలయ న్యాయ శాఖ ప్రొఫెసర్ డా శ్రీ గబ్బిట ఆంజనేయ శాస్త్రి గారు- నేను రచించిన ''గీర్వాణ కవుల కవితా గీర్వాణం –రెండవ బాగం ''నుండి మాణిక్య శాస్త్రి గారి పై ,శ్రీ ఆంజనేయ శాస్త్రి గారి పై రాసిన వ్యాసాలను సంగ్రహించి ఒక ప్రతేక సంచిక (బుక్ లెట్)గా సరస భారతి చేత రూపొందించి స్వంత ఖర్చులతో ముద్రించి ఉదయం శ్రీ మాణిక్య శాస్త్రి గారి పెద్దకుమారులు శ్రీ సూర్యనారాయణ ఘనపాటి గారిచే ఆవిష్కరణ జరిపించి ,అందరికి పంచిపెట్టించారు . మధ్యాహ్నంవిందు భోజనం .చేతి వ్రేళ్ళ సందులలోనుంచి జారిపోయేట్లు ''స్నేహం ''అంటే నెయ్యి వడ్డించి శుష్టు గా ,అందరూ సంతృప్తిగా భుజించేట్లు కొసరి కొసరి వడ్డించి ,తినిపించి ఆనందించారు .

మధ్యాహ్నం 3 గం నుండి 5 గం వరకు శాస్త్రార్ధ చర్చ ఆ తర్వాత 6 -30 నుండి 8 గం వరకు సంగీత విభావరి జరిగాయి . రెండవ రోజు 12-3-17 ఆదివారం ఉదయం 8-30 గం నుండి 10 గం వరకు బ్రహ్మ సూత్ర శంకర భాష్యం లో''ఈక్ష్యత్యధికరణ ప్రవచనం .10 గం నుండి 12-30 వరకు అద్వైత సిద్ధిలో అనుమాన బాధోద్ధార –విచారణ

మధ్యాహ్నం 3 గం నుండి 5-30 గం వరకు ''శాస్త్రార్ధాలు ''.సాయంత్రం 6-30 గం నుండి ''పండితోపన్యాసాలు ''

జరుగుతాయని ఆహ్వాన పత్రిక లో ఉంది .నేను ఆ రోజు వెళ్ళ లేదు కనుక జరిగే ఉంటాయి .

మూడవ రోజు 13-3-17 సోమవారం శ్రీ మాణిక్య శాస్త్రిగారి జన్మదినం –ఉదయం 8-30 నుంచి 10 గం వరకు భగవద్గీత లో అష్టమాధ్యాయం .10 గం నుండి 12 -30 వరకు ''సిద్ధాంత బిందు టీక''లో విచారము .

మధ్యాహ్నం 3 గం నుండి 5-30 వరకు శాస్త్రార్ధాలు .జరిగే ఉంటాయి .

సాయంత్రం 6 30 నుండి 7-30 వరకు సమాపన ఉత్సవం –గురువరేణ్యు లు శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారి శేముషీ వైభవం పై పండితుల ,శిష్యుల ఉపన్యాసాలు .రాత్రి 7-30 గం లకు పండిత సత్కారాలు , వేద స్వస్తి ,వందన సమర్పణ .

నిన్న అంటే 13 వ తేది సోమవారం మధ్యాహ్నం ఒంటి గంటకు శ్రీ గబ్బిట ఆంజనేయ శాస్త్రి గారు ,శ్రీ మద్దులపల్లి దక్షిణామూర్తి గారు ఫోన్ చేసి'' సాయంత్రం పండిత సత్కారం లో మీకు కూడా సత్కారం చేయాలని అనుకొంటున్నాం దంపత్యుక్తంగా రావలసినదని ఆహ్వానించారు .పెద్దల ఆహ్వానం శిరోధార్యం కనుక ,నేను ఏ రకంగానూ పండితుడిని కాదు కనుక ,పండితుల సమక్షం లో సన్మానం కనుక ,జిహ్వా చాపల్యమూ ఉంది కనుక, వస్తాను అని చెప్పి మేమిద్దరం మా మనవడు చి చరణ్ తో కలిసి 5-30 గం లకు శివ రామ కృష్ణ క్షేత్రం చేరాము .అప్పటికి ఇంకా ఉపన్యాసాలు జరుగుతున్నాయి .వారెవరో పేరు తెలియదుకాని అనర్గళం గా గంగా ప్రవాహ సదృశంగా గీర్వాణ భాష లో మాట్లాడి సభా రంజనం చేశారు .వారికి నా నమస్సులు .మద్దుల పల్లి వారి శిష్యులు వారి వారి అనుభవాలను మనసుకు హత్తు కోనేట్లు వివరించి చెప్పారు .అందులో నేను అంతర్జాలం లో మూడవ గీర్వాణం లో రాసిన డా వెంపటి కుటుంబ శాస్త్రి గారు కూడా ఉండటం మహా దానందం కలిగించింది .తనకేమీ తెలియదని మొదలు పెట్టి ,చివరికి మనకేమీ తెలియ దన్నట్లు గా వారు ప్రసంగించిన తీరు అద్భుతం అని పించింది .శ్రీ గబ్బిట వారూ అంతేవాసిగా తమ అనుభవాలను గుదిగుచ్చి చెప్పారు .డా ధూళిపాళ రామ కృష్ణ గారూ గురువుగారి పరిపూర్ణ కటాక్షాన్ని వివరించారు . మాణిక్య శాస్త్రిగారి కుమారుడు శ్రీ దత్తాత్రేయ శాస్త్రిగారు తండ్రి గారి బాణీలో ,అదే స్వరం తో వారు ప్రవచనం చెప్పి నట్లు అర్ధవంతమైన ప్రసంగం చేసి ఆకట్టు కొన్నారు .సభా సంచాలనం శ్రీ విశ్వ నాథ గోపాల కృష్ణ గారు చేశారు .అంతా విన్న తర్వాత నా మనసులో ఒక మాట మెదిలి శ్రీ ఆంజనేయ శాస్త్రి గారి చెవిలో చెబితే ''ఆ మాట ఈ ముఖతా చెబితే గౌరవం గా ఉంటుంది ''అని నన్నే చెప్ప మన్నారు .నేను ''అందరికీ నమస్కారం .అందరూ మహానుబావులు .దిగ్దంతులైన పండిత శ్రేష్టులు .నేను మాణిక్య శాస్త్రి గారి గురించి రెండవ గీర్వాణం లో రాయటానికి ఎంద రెందరినో ఆశ్రయించాను. ఎవరి వద్దా సరైన సమాచారం లేదు .చివరికి శ్రీ తూములూరు శ్రీ దక్షిణా మూర్తి శాస్త్రి గారి వలన మద్దు లపల్లి వారబ్బాయి శ్రీ దక్షిణా మూర్తి శాస్త్రి గారి పరిచయం కలిగి ,వారు పంపిన రెండు పుస్తకాల నుండి విషయ సేకరణ చేసి రాశాను .ఇక్కడ ఈ మూడు రోజులుగా మీరందరూ మాణిక్య శాస్త్రి గారి ప్రతిభా విశేషాలను ఎవరి అనుభవాన్ని బట్టి వారు చాలా వివరం గా తెలియ జేశారు .ఇంతమంది విద్వజ్జనం ఈ సభకు రావటం ఆశ్చర్యం .అది శాస్త్రి గారి పై ఉన్న విశేష అభిమానానికి చిహ్నం .మీరందరి ప్రసంగాలను వ్రాత పూర్వకం గా ఇక్కడి నిర్వాహకులకు అందజేసి వాటిని ఒక పుస్తక రూపంగా తెస్తే మాణిక్య శాస్త్రి గారి పై కొంతవరకు సమగ్రమైన పుస్తకం వస్తుంది. ఆ ప్రయత్నం అందరూకలిసి చేసి సమగ్ర గ్రంధాన్ని ఆ మహానీయునిపై త్వరలో తీసుకు రావలసినదిగా అభ్యర్ధిస్తున్నా ను .నేను రాసింది ఆవగింజలో అరవై వ భాగమే .ప్రస్తుతం అదే అందరికి కర దీపిక గా ఉండటం శ్రీ ఆంజనేయ శాస్త్రి గారి పూనికా నా అదృష్టం''అన్నాను .అంతా బాగానే ఉందన్నారు .నిజంగా అందరూ కలిసి ఆలోచించి పని చేసి ఉంటె ఈ సభలోనే మాణిక్య శాస్త్రి గారి పై ప్రత్యేక సంచిక సమగ్రంగా సర్వ విషయాలతో ఆకర్షణీయంగా రూపొందేది ఆ ఆలోచన ఎందుకు చేయలేక పోయారో నిర్వాహకులు అంతు చిక్క లేదు .

శ్రీ ఆంజనేయ శాస్త్రిగారు తమ గురు వరేణ్యు లు శ్రీ మాణిక్య శాస్త్రి గారి కుమారులకు వస్త్ర ,ధన రూపం గాసత్కరిస్తూ ,పనిలో పనిగా నాకూ ఆ సత్కారం చేసి నన్ను రుణ గ్రస్తుడిని చేశారు . మల్లాది రామ కృష్ణ శాస్త్రి గారు అన్నట్లు '' వేద పండు '' లు ఇందరి ముందు నాకు సన్మానం చేయటం ఆంజనేయ శాస్త్రి గారి విశాల హృదయానికి తార్కాణ,నాపరమ అదృష్టం .ఈవిధంగా సుమారు 100 మందికి పైగావేద, శాస్త్ర విద్వాంసులను ఘనంగా సత్కరించి శత జయంతికి ఘనత చేకూర్చారు .ఇందులో పాల్గొన్న వారందరికీ అభినందనలు .

కొసమెరుపు –శత జయంతి ఉత్సవాలు షడ్ర సోపేత భోజనాదులలో వైభవంగానే జరిగాయని పించాయి .ఆహ్వానాలు అందరికీ అందలేదని కొందరికి మాత్రమే చేరాయని ఆహ్వానాలు వేరు కరపత్రాలు వేరుగా ఉన్నాయని ,వాట్సప్ లో పంపి చేతులు దులుపుకున్నారని గుసగుసలు వినిపించాయి . ఆహ్వానం లో ఎవరెవరు వచ్చి పాల్గొంటున్నారో వారి వివరాలు రాయక పోవటం దారుణం .మూడు యూని వర్సిటీ లకు వైస్ చాన్సలర్ గా పని చేసి ,పారిస్ లో ఉన్న ''ఇంటర్ నేషనల్ అసోసియేషన్ ఆఫ్ సాంస్క్రిట్ స్టడీస్''కు అధ్యక్షులుగా ఉన్న శ్రీ వెంపటి కుటుంబ శాస్త్రి గారి పేరే ఆహ్వాన పత్రికలో లేక పోవటం చాలా వింతగా ఉంది. సంగీత కచేరీ చేసిన ఆమె పేరూ ముద్రించక పోవటం బాధ్యతా రాహిత్యం అని పించుకోదా?వేదికపై పసంగించేవారు వారి ధోరణిలో వారు సంస్కృత లోకం లో విహరిస్తూ ఉంటే ప్రేక్షక స్థానం లో ఉన్నవారు ఎవరి వ్యాసంగం లో వారు ఉండి పోయి, వక్తకు నిరాశే మిగిల్చారు .

మూడు రోజుల కార్య క్రమం లో శాస్త్ర చర్చలు అందులో నిష్ణాతులకు మాత్రమే కదా,మిగతావారికి అందులో ఆహ్లాదం ఉండక పోవటం సహజం .కనుక మధ్యమధ్యలో వారి ప్రసంగ సారాంశం తెలుగు లో చెప్పి ఉంటె కొంత ఆకర్షణ ఉండేది .

ఇంత పెద్ద కార్యక్రమం ఇద్దరు పీఠాధి పతుల ఆశీస్సులతో నిర్వహిస్తూ కూడా మీడియా వారికి తెలియ జేయక పోవటం ఇక్కడ జరిగిన విషయాలు పత్రికా ముఖంగా ప్రచురణ భాగ్యానికి నోచుకోక పోవటం ఆశ్చర్యం .దీనికి బాధ్యులెవరు ? వేదిక మీద ఎప్పుడూ ఒకే పెద్దాయన ఉండి మిగిలిన వారికి సరైన గౌరవం దక్కలేదనే నిట్టూర్పులు వినిపించాయి .లక్షలు ఖర్చు పెట్టి చేసిన కార్యక్రమం అందరి తోడ్పాటుతో ,అందరి ప్రాతినిధ్యం తో ,ఎంతో స్పూర్తి దాయకం గా పరి సమాప్తి కావాల్సింది .అలాజరగ లేదనే అని పించింది .ఇంతటి కార్య క్రమాన్ని వీడియో తీయించలేక పోవటం, రికార్డ్ చేయించలేక పోవటం ప్రసార మాధ్యమాల విలువ విపరీతం గా ఉన్న ఈ కాలం లో నచ్చని పని .అయితే కొందరు ఉత్సాహ వంతులు స్వంత వీడియో కెమెరాలతో వారికి కావలసినవి వీడియో తీసుకున్నారు .ఇప్పటికైనా మించి పోయింది లేదు వారి వద్ద సేకరించి ఒక సమగ్ర సి .డి. గాతీసి చానల్ వారికిస్తే ప్రపంచ వ్యాపితంగా కార్యక్రమం తెలుస్తుంది .

వీటన్నిటికి మించి మరొక పెద్ద లోపం –చివరి రోజు సాయంత్రం సభను బహిరంగ సభగా నిర్వహించి బెజవాడలోవివిధ రంగాలలో ప్రముఖులను కూడా ఆహ్వానించి వారి ఉపన్యాసాలనూ ఏర్పాటు చేస్తే, మాణిక్య శాస్త్రి గారి మాణిక్య ప్రభా విశేషం లోక విదితమయ్యేది . ఈ ఆలోచన రాక పోవటం విడ్డూరం .

మొదటి రోజు నేను వెళ్ళినప్పుడు ఒక 70 ఏళ్ళ ముసలావిడ ''బాబూ ! ఉదయం 6 అయిందంటే ఇక్కడ మేమందరం కనీసం మూడు వందలమంది మాణిక్య శాస్త్రి గారి ప్రవచనం వినటానికి హాజరయ్యేవారం .ఆ అభిమానమే

మళ్ళీ ఇక్కడికి మమ్మల్ని రప్పించింది ''అన్నది .ఆమె మాటలకు నాకు ఒళ్ళు గగుర్పొడిచింది. అంతటి అభిమానం సంపాదించారు శాస్త్రి గారు .

లోపాలను చూపటమే ధ్యేయం కాదునాది .మరింత స్ఫూర్తిదాయకం గా నిర్వహిస్తే సంతృప్తి ఆనందం దక్కేదికదా అని మాత్రమే .

మహా మహోపాధ్యాయ స్వర్గీయ బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారి శత జయంతి ఉత్సవాలు విజయవాడ శివ రామ క్షేత్రం లో 11-3-17 నుండి 13-3-17 వరకు వారి శిష్యులలో ప్రముఖులు శాస్త్ర విద్వన్మణి,ఆర్ష విద్యాభూషణ ,న్యాయ రత్న ,భాషా శాస్త్ర వేత్త ,న్యాయ విద్యా ప్రవీణ, వేదాంతాచార్య ప్రస్తుత బెనారస్ హిందూ సంస్కృత విశ్వ విద్యాలయ న్యాయ శాఖ ఆచార్యులైన డా శ్రీ గబ్బిట ఆంజనేయ శాస్త్రి గారు మొదలైన శిష్య బృందం ఘనం గా నిర్వ హిస్తున్న సందర్భం గా , శ్రీ మాణిక్య శాస్త్రి గారి జీవితం, సాహిత్యం పైనా ,శ్రీ ఆంజనేయ శాస్త్రి గారి జీవిత సాహిత్యాలపైన నేను ''గీర్వాణకవుల కవితా గీర్వాణం -రెండవ భాగం ''లో రాసిన వ్యాసాలను సంగ్రహించి ,కొత్త విషయ విశేషాలు చేర్చి రాయగా ప్రత్యేక బుక్ లెట్ గా సరస భారతి తరఫున స్వంత ఖర్చులతో శ్రీ గబ్బిట ఆంజనేయ శాస్త్రి గారు ప్రచురించి మొదటి రోజు 11-3-17 శనివారం శ్రీ మాణిక్య శాస్త్రిగారి పెద్దకుమారుల చేత ఆవిష్కరింప జేసి సభ లో పాల్గొన్న వారందరికీ ఉచితం గా అందజేసి తమ గురు భక్తిని చాటుకున్నారు . ఇందులో నాది ఉడత సాయం మాత్రమే -మీ దుర్గా ప్రసాద్

మహామహోపాధ్యాయ మద్దులపల్లి మాణిక్యశాస్త్రి గురువరేణ్యుల

# శతజయంత్యుత్సవములు

11-03-2017 12-03-2017 13-03-2017



సంగ్రహ చరిత్ర

## గబ్బిట దుర్గాప్రసాద్

# మహామహోపాధ్యాయ తర్క వేదంత రత్న
# బహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రి గారు

**(1916-2008)**



సదాశివ సమారంభామ్.. శంకరాచార్య మధ్యమామ్..
అస్మదాచార్య పర్యంతామ్.. వందే గురు పరంపరామ్..

వేదాంతాదిషు శాస్త్రేషు విద్వన్మాణిక్య భూషణం..
మాణిక్య శాస్త్రిణం నౌమి న్యాయమార్తాండ డిండిమమ్...



ఆంధ్ర దేశంలో తర్క శాస్త్రంలో అద్వితీయులనిపించుకొని, వందలాది శిష్యులను ఆ శాస్త్రంలో తీర్చిదిద్ది, వేలాది పురాణ ప్రవచనాలు చేసి, విజయవాడకే ఒక గొప్ప శాస్త్రీయ గౌరవన్ని కల్పించిన వారు శ్రీమద్దుల పల్లి మాణిక్య శాస్త్రి గారు. చెవులకు కుండలాలు, నుదుట విభూతిరేఖలు, ఫాలభాగం లో కుంకుమ, వంటి నిండా అతి విలువైన కాశ్మీర శాలువా, చక్కనివెడల్పు అంచుల ఖద్దరు ఆంధ్రబిళ్ళ గోచి కట్టుతో, స్ఫురద్రూపంతో, బ్రహ్మవర్చస్సుతో శాస్త్రిగారిని చూస్తే,అపర శంకరులనిపించేవారు. వారు లేని వేదాంత సభ, తర్కసభ ఉండేదికాదు. అందర్లోనూ కొట్టొచ్చినట్లు కనిపించే మహగాంభీర్య మూర్తిమత్వం వారది. చాలా సభలలోనూ, విజయవాడలో మాబంధువుల వివాహ సందర్భాలలోను వారిని చూశాను . సభా తాంబూలం వారికిచ్చి ఆశీర్వచనం పొంది యజమానులు ధన్యులయేవారు. ఆ వర్చస్సు, అఠీవి, ఆరాజసం, ఆవిద్వత్తు, ఆవ్యాసంగం, ఆఉపన్యాస ధోరణి, ఆప్రతిభా, నాన్యతో దర్శనం అనిపించేవి. రాష్ట్రపతి సన్మాన గ్రాహీతలైన వారి గురించి ఈతరం వారికెవరికీ తెలియక పోవటం ఆశ్చర్యమే. ఎంతో మంది గీర్వాణ కవుల గురించి రాశానుకదా మరి మద్దుల పల్లి వారి గురించి వెలితి ఉండిపోయిదనే విషయం నన్ను బాధించిది. నాకు తెలిసిన వారి నందర్నీ సంప్రదించాను. ఎవరికీ తెలియదన్నారు. నా తపన గమనించిన పొన్నూరు సంస్కృత కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్ డా॥ శ్రీ తూములూరు శ్రీదక్షిణమూర్తి శాస్త్రిగారు మద్దుల పల్లి వారి అబ్బాయి బావ మరిది ఫోన్‌నంబర్ ఇచ్చారు. ఆయనకు ఫోన్ చేస్తే మాణిక్య శాస్త్రి గారి అబ్బాయి శ్రీదక్షిణా మూర్తి గారి నంబర్ ఇచ్చారు. వారితో మాట్లాడి నా తపన చెప్పి సరసభారతి పుస్తకాలు పంపాను. వారు తమ తండ్రిగారు రాష్ట్రపతి పురస్కారాన్ని అందు కొన్నపుడు అయన గౌరవార్థం బెనరస్ విశ్వవిద్యాలయం తెచ్చిన

ప్రతేక సావనీర్‌ను , శ్రీ శంకరాచార్య ప్రకరణాలపై మాణిక్య శాస్త్రి గారు రాసిన "తత్వ ప్రభ "గ్రంథాన్ని పంపారు. మొదటిది అంతా సంస్కృతంలో వివిధ లబ్ధ ప్రతిష్ట రచయితలు రాసిన ఉత్తమ వ్యాసాలున్నది. అందులో మా గబ్బిట వార్తైన డా॥ శ్రీ గబ్బిట ఆంజనేయశాస్త్రి గారి వ్యాసమూ ఉంది. శాస్త్రిగారికుమారులు దక్షిణామూర్తిగారు హిందీలో తమ తండ్రిగారి గురించి వ్రాసిన వ్యాసం అందులో ఉంది. అదే ఈ వ్యాసానికి ఆధారం.

## జనన విద్యాభ్యాసాలు



శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారు 1916 ఫాల్గుణ బహుళ పాడ్యమి నాడు ప్రకాశం జిల్లా కలిగిరి మండలం ఆనంద పురాగ్రహారంలో జన్మించారు. తల్లిదండ్రులు శ్రీమతి చెంచులక్ష్మి, శ్రీ దత్తాత్రేయ శాస్త్రి గార్లు. తండ్రి ప్రకాండ వైయాకరుణులు. జ్యోతిష శాస్త్రంలో నిష్ణాతులు. ఆయన రోజులో ఎక్కువ భాగం భగవధ్యానం, పూజ లోను, విద్యార్ధులకు బోధనలోను, ప్రజాహిత కార్యక్రమాలలోను గడిపేవారు.

భార్యతో వారి దాంపత్య జీవితం సుఖ సంపన్నంగా ఉండేది. ఈ దంపతుల ప్రధమ సంతానం శ్రీమతి వెంకట సుబ్బమ్మ, రెండు శ్రీసత్యనారాయణ శాస్త్రి, మూడు శ్రీలక్ష్మీ నరసింహ శాస్త్రి, నాలుగు శ్రీ మాణిక్య శాస్త్రి, అయిదు శ్రీమతి లక్ష్మీ వేదమ్మగార్లు. జ్యేష్టపుత్రుడైన సత్యనారాయణ శాస్త్రి గారు సంస్కృతాంధ్రాలలో ప్రసిద్ధ కవి. రెండవ కుమారుడు శ్రీలక్ష్మీ నరసింహ శాస్త్రి సంగీత శాస్త్రంలో సుప్రసిద్ధ విద్వాంసులు. ఆఖరి వారైన శ్రీకృష్ణమూర్తి శాస్త్రి అధ్యాపకులుగా పని చేసి విశ్రాంతి తీసుకొంటున్నారు.

చిన్నతనం నుండి మాణిక్య శాస్త్రిగారు తండ్రి గారి వద్ద సంస్కృతాధ్యయనం చేశారు. శాస్త్రాలు నేర్వాలన్న ఆ కాంక్షతో 12వ ఏటనే కాశీ వెళ్ళారు. అక్కడ తర్క, వేదాంత శాస్త్రాలు అభ్యసించారు. పది సంవత్సరాల కఠోర పరిశ్రమ చేసి ప్రకాండ పండితులై, కాశీ మహరాజు చేత ఘన సన్మానం అందుకొన్నారు. తర్వాత స్వగృహం చేరారు. శ్రీ వేమూరి రామ బ్రహ్మ శాస్త్రి మహొదయుల వద్ద శిష్యరికం చేసి తర్క, వేదాంతాల అంతు చూశారు. గురువుగారి ప్రశంసలు అందుకొన్నారు. శ్రీగోరుగంత

సుబ్రహ్మణ్య శాస్త్రి గురువరేణ్యు ల వద్ద చాలాకాలం విద్య నభ్యసించి గురువుగారిచే "నువ్వు ఇప్పుడు విద్వన్మణి వయ్యావు. గురువుకు కూడా చిర యశస్సు కలిగించి ప్రకాండ పండితుడివై విశ్వ విఖ్యాత కీర్తినార్జిస్తావు " అని ఆశీరభినందనలు అందుకొన్న విద్యా మాణిక్యం మాణిక్య శాస్త్రి గారు.

## వివాహం సంతానం



విప్పర్ల పల్లి నివాసి శ్రీ వంగల శ్రీకృష్ణ మూర్తి, శ్రీమతి ఆదిలక్ష్మి దంపతుల సుపుత్రి శ్రీమతి సుబ్బ లక్ష్మిని శ్రీమాణిక్య శాస్త్రి వివాహమాడారు. మాణిక్య శాస్త్రిగారు మొదట్లో ఆగిరిపల్లి సర్వ తంత్ర స్వతంత్ర విద్యాలయంలో అధ్యాపకులుగా సేవ చేశారు. తర్వాత విజయవాడకు చేరి భారత మహిళా మండలిలో పురాణ ప్రవచనం చేస్తూ, శిష్యులకు తర్క, వేదాంత శాస్త్రాలు బోధిస్తూ నేర్చిన విద్యకు సార్ధకత కల్పించారు. 1954లో విజయవాడలో స్వగృహం నిర్మించుకొన్నారు.

మాణిక్య శాస్త్రి గారికి పంచాగ్నుల వంటి అయిదుగురు కుమారులు జన్మిచారు. ప్రధమ పుత్రులు శ్రీసూర్య నారాయణ ఘనాపాఠీ విద్యార్థులకు వేదాధ్యయనం గరుపుతూ 25 మంది ఘనా పాఠీలను తయారు చేసిన ఘనులు. రెండవ కుమారుడు శ్రీలక్ష్మీ నరసింహ శాస్త్రిగారు 20మంది చార్టర్డ్ అకౌంట్స్‌ను తయారు చేసిన విశేష సునిసిత మేధావి.

మూడవ కుమారులు శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారు తండ్రిగారి సేవలో తరిస్తూ జీవితాన్ని సార్ధకం చేసుకొన్నారు. నాలుగవ పుత్ర రత్నం శ్రీదక్షిణామూర్తిగారు పూజ్యపాదులైన జనకుల వద్దనే సంస్కృతాన్ని అభ్యసించి కేంద్రీయ విద్యాలయంలో సంస్కృత అధ్యాపకులుగా సేవలందిస్తున్నారు.

తండ్రిగారి వారసత్వాన్ని నిలుపుతూ పురాణప్రవచనాలు చేస్తూ ఆర్ష విజ్ఞానాన్ని వ్యాపింపజేస్తున్నారు. అయిదవ కుమారులు శ్రీదత్తాత్రేయ శాస్త్రిగారు తండ్రిగారు మాణిక్య శాస్త్రిగారి శాస్త్ర జ్ఞానాన్ని ఆపోసన పట్టి ఉత్తరాధికారిగా తర్క, వేదాంతాది శాస్త్రాలను అధ్యయనం చేసి బహు ప్రఖ్యాతులయ్యారు. విశాఖపట్నం ఆంధ్రవిశ్వ విద్యాలయం లో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా వెలుగొందుతున్నారు. మాణిక్య శాస్త్రి గారి పుత్రులు అయిదుగురూ మాణిక్యాల లాంటి వారే. తండ్రి గారి యశస్సును ద్విగుణీకృతం చేస్తున్నారు. ధన్య జీవి శాస్త్రిగారు.

## రచనా వ్యాసంగం

అనేక విషయాలపై శాస్త్రి గారి భాషణలు ,ప్రసంగాలు, చర్చలు, అధ్యాపనం పురాణ ప్రవచనం విశేషాలను ప్రముఖ పత్రికలన్ని వ్యాసపరంపరగా అందజేసేవి. వారి వ్యాసాలను ప్రచురించేవి. దిన పత్రికలైన ఇండియన్ ఎక్స్‌ప్రెస్, హిందూ పత్రికలూ ఆంగ్లంలో వారి ప్రసంగాలను ప్రచురించేవి. శాస్త్రిగారు ఎక్కడ ఏ విషయమై రాసినా, మాట్లాడినా, పత్రికలన్నీ వెంటనే ప్రముఖం గా ప్రచురించి వారి భావధారను వ్యాప్తి చేసేవి. ఆంధ్ర పత్రిక, ఈనాడు వంటి తెలుగు పత్రికలు శాస్త్రిగారి బహుముఖీన పాండిత్యం, విద్వత్తుల గురించి ప్రత్యేక వ్యాసాలు రాసేవి. ప్రధాని నెహ్రూ నుండి పొందిన సన్మాన వార్తలను ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఘనంగా ప్రచురించి శాస్త్రిగారి కీర్తిని దశ దిశలా చాటింది. దర్భంగా మహరాజు చేసిన సన్మానాన్ని ప్రముఖంగా ప్రచురించి వారి కీర్తి కిరీటానికి మరో కలికితురాయి నంద జేసింది. మాణిక్యశాస్త్రిగారు అనుక్షణ వ్యాసంగం లో ఉంటూ కూడా "శ్రీ శంకరాచార్య ప్రకరణలపై" తత్వ రహస్య ప్రభ'రాశారు. దీనికి రాష్ట్రపతి పురస్కారం ఘన సన్మానం లభించింది. ఇందులో దక్షిణా మూర్తి స్తోత్రం, అపరోక్షాను భూతి, దశ శ్లోకి, సోపాన పంచకం, ఏక శ్లోకీ, మనీషా పంచకం మొదలైన వాటిని వివరణ తో చర్చించారు. శాస్త్రిగారి రెండవ గ్రంథం "తత్వ సంవిజ్ఞాన పీఠికా".ఇందులో భక్తి, ముక్తి మార్గాలు అనేక వేదాంత విశేషాలు, ఉదాహరణలు ఉంటాయి. వీరి తత్వ రహస్య ప్రభ ఇప్పటికీ లభ్యమే..

## శాస్త్రిగారి గురుకులం

మాణిక్య శాస్త్రి గారింట ఎందరో విద్యార్థులు ఉండి,నిరంతర విద్య అధ్యాపనం చేసేవారు. వారే తర్వాత అగ్రగణ్య పండితులై గురువుగారి కీర్తికి కూడా కారకులయ్యారు. శాస్త్రిగారి సుపుత్రులు డా॥శ్రీ మద్దులపల్లి దత్తాత్రేయ శాస్త్రిగారు ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఆచార్యులై,పురాణ ప్రవచకులై గురుపరంపరను కొనసాగించటం విశేషం. శ్రీ దెందుకూరి పెదయజ్ఞనారాయణ శాస్త్రి, శ్రీ శ్రీనివాస తాతాచార్య, శ్రీ తట్టా రఘునాథాచార్య సలక్షణ ఘనపాటి, శ్రీ దెందుకూరి వెంకటేశ్వర్లు, శ్రీరాణీమురళీ కృష్ణ కేంద్రీయ విద్యాలయంలో సంస్కృతాధ్యాపకులై గీర్వాణ సేవలో తరిస్తున్నారు. శ్రీధూళిపాళ రామకృష్ణ విజయవాడ మేరిస్టేల్లా కళాశాలలో సంస్కృత ఆచార్యులై భాషా సేవలందిస్తున్నారు. శ్రీపాలడుగు సుబ్రహ్మణ్య శాస్త్రి సంస్కృతాధ్యాపనం తోబాటు పురాణ ప్రవచనంలోను అద్వితీయులనిపించుకొన్నారు. ఈ శిష్య పరంపర ప్రతి ఏడాది మాణిక్య శాస్త్రి గారి జన్మదిన మైన ఫాల్గుణ బహుళ పాడ్యమి నాడు గురు పూజోత్సవాన్ని అతి వైభవంగా నిర్వహిస్తారు. అంతర్గత వేద, శాస్త్ర సభలను ఏర్పాటు చేస్తూ భక్తి శ్రద్ధలతో పండిత సన్మానాలను వైభవంగా చేసి గురుభక్తిని ప్రకటించుకొవటం ఒక విశిష్టమైన ఆదర్శవంతమై ఆనవాయితీ. దేశంం లోని వివిధ ప్రాంతాలనుండి ఇక్కడికివచ్చి శాస్త్రిగారి అంతేవాసులై శాస్త్రవిద్య నభ్యసిచిన వారిలో శ్రీవేద వ్యాస, శ్రీశ్రీనివాసాచార్య శ్రీకృష్ణ రాజ తంత్రి, ప్రొఫెసర్ శ్రీ ఓరుగంటి రామలాల శర్మ, శ్రీ గుంటూరు రామచంద్ర

సోమయాజులు, శ్రీ కంభంపాటి నాగేశ్వరావధానులు, శ్రీ గబ్బిట ఆంజనేయ శాస్త్రి మొదలైన మహాపండితులు ఉన్నారు. శ్రీ కనకదండి కృష్ణప్రసాదశాస్త్రి వారి దగ్గర రామశబ్ధం ప్రారంభించి ప్రస్తుతం విజయనగరం వేదవిద్యాలయానికి ప్రిన్సిపల్‌గా ఉన్నారు. శిష్యులలో మాణిక్య శాస్త్రిగారికి ప్రియశిష్యులు డా॥శ్రీ గబ్బిట ఆంజనేయ శాస్త్రిగారు బెనారస్ విశ్వ విద్యాలయం లో వైదిక దర్శన విభాగం లో ప్రొఫెసర్ గా పనిచేస్తున్నారు. అనేక మంది విద్యార్థులకు మార్గ దర్శనం చేస్తున్నారు. గురు కీర్తి దశ దిశలా వ్యాపింప జేసి గురూణం తీర్చుకొంటున్న శాస్త్రిగారి ప్రియతమ అంతేవాసి, డా.గబ్బిట ఆంజనేయ శాస్త్రిగారు..

## బిరుద సత్కార పురస్కారాలు

శ్రీ శృంగేరి శారద పీఠం, శ్రీకంచి కామకోటి పీఠం,ఉడిపి పెజావర్ మఠం, తిరుపతి దేవస్థానాలకు శ్రీ మాణిక్య శాస్త్రిగారు ఆస్థాన పండితులై గౌరవం పొందారు. ఇందులో కొందరు పీఠాదిపతులకు శాస్త్రిగారు తర్క వేదాంత గురువులవటం మహాగొప్ప విషయం. శాస్త్రిగారి శాస్త్రార్థాన్ని వినిన శ్రీ శృంగేరీ శారదా పీఠాధిపతులు శ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ స్వామి వారు "విజయవాడలో దుర్గా దేవి కృష్ణవేణీ నది మాత్రమే ఉన్నాయని భావించాను. కానీ శ్రీ శాస్త్రి గారి వాఖ్యార్థము విన్నతరువాత ఇక్కడ సనాతన ధర్మప్రోధిత మహాసాగరం ఉందనిపించింది" అని గొప్పగా శ్లాఘించారు. కంచి కామకోటి జగద్గురువులు శ్రీశ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వామి వారు "సమర్థులైన బోయీలు అందమైన పల్లకీని పుష్పమాలికగా ధరించి నడిచేటప్పుడు లోపల ఉన్న వారికి కలిగే ఆనందం, సౌకుమార్యం, ఆహ్లాదంవలే శ్రీ శాస్త్రిగారి ప్రవచనం ఉన్నది" అని మెచ్చారు. శాస్త్రి గారి ప్రవచనం పెద్దన కవి "అంబర చుంబి విరస్సరీఝరీ" ప్రవాహం లాగా శబ్ధధ్వనిలాగా కాకుండా పోతన గారి "మందాకినీ వీచికల తేలు రాయంచల సమూహంలాగా" నెమ్మదిగా మనస్సుకు హత్తుకునేట్లు ఉండటం ఆశ్చర్యకరమైన విషయం. 1992లో రాష్ట్రపతి శ్రీ ఆర్.వెంకట్రామన్ గారు మాణిక్య శాస్త్రి గారు చేసిన సంస్కృత సేవలను గుర్తించి రాష్ట్రపతి పురస్కారాన్ని అందజేసి ఘనంగా సత్కరించారు. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నుండి బహు పర్యాయాలు పురస్కారం పొందారు. శాస్త్రి గారు తమ అపార పాండిత్యానికి తగినట్లు "తర్క వేదాంతాచార్య, దర్శనాచార్య, తర్క వేదాంత రత్న, మహామహోపాధ్యాయ మున్నగు బిరుదులందుకొన్న సమర్థులైన దేశికులు.. శాస్త్రిగారు అగణిత పండితులకు అధ్యాపనం గరపటం, వేలాది భక్తులకు ముక్తిమార్గదర్శనం చేయించటం బహు ప్రశంస నీయం. అనేక మంది శిష్యులు గురువుగారిపై ఉన్న గౌరవ ప్రపత్తులకు నిదర్శనంగా తమ పిల్లలకు మాణిక్యశాస్త్రి పేరు పెట్టడం చిరస్మరణీయం. ఇలా జరగటం బహు అరుదు. ఈ అరుదైన ఆ గౌరవాన్ని దక్కించుకొన్న వారు శ్రీ మాణిక్య శాస్త్రిగారు.

## మాణిక్య శాస్త్రి గారి మహాప్రస్థానం

ఒక సుప్రసిద్ధ సంస్కృత శ్లోకం "పరివర్తిని సంసారే మృత: కోవాన జాయతే

– సజాతో యేన జాతేన యాతి వంశ: సమున్నతిం"లో చెప్పినట్లు జీవించిన వారందరూ మరణించి ఏదో ఒక జన్మ పొందుతారు. కానీ ఎవని పేరు ఆతని వంశానికి ఉన్నతి కలిగిస్తుందో అలాంటి వాని జీవితం ధన్యం. ఇలాంటి పేరు ప్రతిష్ఠలను మాణిక్య శాస్త్రిగారు తన వంశానికి కలిగించి, ధన్య జీవులయ్యారు. 92 ఏళ్ళ సార్థక జీవనం గడిపిన తర్క వేదాంత రత్న, మహా మహోపాధ్యాయ శ్రీమద్దుల పల్లి మాణిక్య శాస్త్రిగారు 8-4-2008 బ్రాహ్మీ ముహూర్తంలో బ్రహ్మపథం చేరుకున్నారు.

"జయంతితే సుకృతినో రస సిద్ధా: కవీశ్వరా: – నాస్తి తేషాం యశ: కాయే జరామరణ వర్జితం".

బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారి శత జయంతి ఉత్సవాల సందర్భంగా – నేను రచించిన – గీర్వాణ కవుల కవితా గీర్వాణం – రెండవ భాగం నుండి పైవ్యాసం గ్రహింపబడినది.




**గబ్బిట దుర్గాప్రసాద్**

అధ్యక్షులు – సరసభారతి సాహిత్య సాంస్కృతిక సంస్థ
ఉయ్యూరు-521165-కృష్ణా జిల్లా,
చరవాణి- 9989066375.










శాస్త్ర విద్వన్మణి, ఆర్షవిద్యాభూషణ, న్యాయరత్న, భాషా శాస్త్రవేత్త, న్యాయ విద్యా ప్రవీణ, వేదాంతా చార్య

## శ్రీ గబ్బిట ఆంజనేయశాస్త్రి (1956)



డా॥ శ్రీ గబ్బిట ఆంజనేయ శాస్త్రి 15-8-1956న కృష్ణాజిల్లా పెదపారుపూడి మండలం యలమర్రు గ్రామంలో జన్మించారు. తండ్రి శ్రీ గబ్బిట మేధా దక్షిణామూర్తి శాస్త్రి గారు, తల్లి శ్రీమతి భ్రమరాంబాసావిత్రి గారు. కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యా పీఠంలో చదివి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చేరి 1980లో ఎం.ఏ పాసైనారు. 1979లో శ్రీమతి పద్మావతి గారిని వివాహం చేసుకున్నారు. వీరికి ముగ్గురు కుమారులు. శ్రీ సుబ్రహ్మణ్య సీతారామశర్మ, జయమాణిక్య శాస్త్రి, శ్రీ శ్రీనివాస యజ్ఞ దక్షిణామూర్తి శాస్త్రి. 82లో గుంటూరు విద్వత్ పరిషత్, గౌరవ డాక్టరేట్ నిచ్చి గౌరవించింది. తిరుపతి కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం 1985లో గౌరవ డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ పురస్కారమిచ్చి సన్మానించింది.

గుంటూరులో డాక్టర్ శ్రీ కొలచల వెంకటకృష్ణ శాస్త్రి గారి సంస్కృత కళాశాలలో 1977 నుండి 83 వరకు లెక్చరర్‌గా పనిచేసి 1983-88 కాలంలో తిరుపతిలోని న్యాయ సంస్కృత విద్యా పీఠంలో సేవలందించి, తర్వాత బెనారస్‌లోని న్యాయ వైదిక దర్శన సంస్కృత కళాశాలలో రీడర్‌గా ఉన్నారు. 1988 నుండి బెనారస్ హిందూ సంస్కృత విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖాధ్యక్షులుగా పనిచేస్తున్నారు. 1997 నుంచి తర్క, వేదాంత శాస్త్రాలలో ప్రొఫెసర్‌గా ఉన్నారు.

శాస్త్రి గారి గీర్వాణ రచనలు - 1982లో జగదీశ భట్టాచార్య తర్కామృతంపై "మాణిక్య ప్రభ" రాశారు. 1995 మాధురీ గాదాధరీ మత భేద విమర్శ రచించారు. 1987లో "పంచలక్షణ శతకోటి"కి సంపాదకత్వం వహించారు. రామ రుద్రీయ వ్యుత్పత్తి వాదం మొదలైన వాటిపై ధారా వాహికంగా 1978 నుండి 1981 వరకు నాలుగేళ్ళు విజయవాడ ఆకాశవాణిలో తర్క శాస్త్ర వైభవం, అనిత్యః శబ్దః, పరమాణు స్వరూపం, వ్యక్తి వివేక విమర్శనం మున్నగు అంశాలపై ప్రసంగాలు చేశారు.

శ్రీ ఆంజనేయ శాస్త్రి గారు 1984-88 వరకు తిరుమల తిరుపతి దేవస్థాన ఉపన్యాసకులుగా ఉన్నారు. వారణాసి కే.కే.డిలో హైదరాబాద్‌లోని డివైన్ లైఫ్ సొసైటీలో

సభ్యులు, వక్తలుగా ఉండి భాగవత, రామాయణ, సాంృద పురాణాంతర్గత కాశీఖండాలపై ప్రవచనం చేశారు. సంప్రదాయ న్యాయ మీమాంస వేదాంత శాస్త్రాలను బోధించటమే శాస్త్రిగారి ముఖ్య అభిరుచి. ఈ శాస్త్రాలలో వీరికి గురువులు మహా మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారు, పండిత రాజ ఎస్.సుబ్రహ్మణ్య శాస్త్రి గారు, పండిత రాజ, పద్మభూషణ్ పి.యెన్.పట్టాభిరామ శాస్త్రి గారు, న్యాయ వేద వేదాంత విద్వాన్ శ్రీ ధూళిపాళ రామచంద్ర శాస్త్రి గారు, కవితార్కిక చక్రవర్తి శ్రీ దోర్బల ప్రభాకర శర్మ గారు.

కీ.శ.1670 కాలపు వాడైన నాగేశభట్టు భట్టోజీ దీక్షితుల భారతీయ పంచాంగం ప్రకారం కాల, తిథి నిర్ణయంపై "తిథి నిర్ణయం" అనే సంస్కృత వ్యాఖ్యా విభూషితం చేశారు. శాస్త్రి గారి ద్వితీయ పుత్రులు, పూరీ జగన్నాధ సంస్కృత విశ్వవిదాల్యంలో తర్క శాస్త్రంలో అసోసియేట్ ప్రొఫెసర్ అయిన శ్రీ జయమాణిక్య శాస్త్రి "మణిప్రభ హిందీ వ్యాఖ్య" సంవలితం చేశారు. దీనిని వారణాసి శారదా సంస్కృత సంస్థానం 29012లో ప్రచురించింది. ఇది న్యాయ తత్వ శాస్త్రంపై మహా వ్యాఖ్యానం. జ్యోతిషశాస్త్రంపై కాళిదాసుని "కాలామృతం"కు చింతలపాటి వెంకటయజ్వ రచించిన "ఉజ్వలా వ్యాఖ్యానం"ను శాస్త్రి గారు సంపాదకులుగా వెలువరించారు. దీన్ని తిరుపతి వేద విశ్వవిద్యాలయం ముద్రించింది. క్రీ.శ.1600 కాలం వాడైన మధురానాథ తర్క వాగీశుని "మాధురీ "17, 18 శతాబ్దాలకు చెందిన గదాధర భట్టాచార్య రాసిన "గాదాధరీ", 13వ శతాబ్దికి చెందిన గంగేశుని "తత్వ చింతామణి" వ్యాఖ్యానాలను తులనాత్మకంగా పరిశోధించి శాస్త్రిగారు "మాధురీ గాదా ధర్యోర్మత భేద విమర్శ" అనే ఉద్గ్రంథాన్ని రాశారు. దీన్ని తిరుపతి పద్మావతీ ప్రకాశన సంస్థ ప్రచురించింది. రామరుద్ర భట్టాచార్యులు రాసిన "వ్యుత్పత్తి వాద వ్యాఖ్యానాన్ని" మద్రాస్‌లోని అడయార్ లైబ్రరీ నుంచి కంచి కామకోటి పీఠ ఆస్థాన విద్వాంసులైన మహా మహోపాధ్యాయ శ్రీ ఎస్.ఆర్.కృష్ణమూర్తి శాస్త్రి గారి ద్వారా తెప్పించి "వ్యుత్పత్తి వాద: - రామ రుద్రీయ వ్యాఖ్యాన సహిత:" అని ప్రకాశనం చేశారు. దీనిని న్యూ ఢిల్లీ సంస్కృత సంస్థానం ముద్రించింది. ఆదిత్యాచార్య వైదిక కర్మకాండలపై రాసిన 'షడ శీతి'పై నంద పండిత వ్యాఖ్యాన పరామర్శ రాశారు. దీన్ని ఉజ్జెన్‌లోని ఇండలాజికల్ రీసెర్చ్ సంస్థ ముద్రించింది.

డా॥ శ్రీ ఆంజనేయ శాస్త్రి గారు అనేక మంది విద్యార్థులకు తర్క, వేదాంత, మీమాంస శాస్త్రాలను బోధిస్తూ పరిశోధనకు ప్రోత్సహిస్తూ సుమారు 25 మందిచే తర్క వేద వేదాంత శాస్త్రాలలో పి.హెచ్.డి. సాధించటానికి మార్గ దర్శనం చేశారు. ప్రస్తుతం వీరి మార్గదర్శనంలో 10 మంది పి.హెచ్.డి., పి.డి.ఎఫ్ చేస్తున్నారు. కంచి కామకోటి పీఠాదిపతులు శ్రీశ్రీచంద్ర శేఖరేంద్ర సరస్వతి స్వామి వారి సన్నిధిలో శాస్త్రిగారు శాస్త్రార్థం చేసి స్వర్ణపతకం పొందారు. శ్రీ వారి అనుగ్రహంతో శ్రీ విజయేంద్ర సరస్వతీ స్వామివారికి తర్క శాస్త్రాన్ని వినిపించారు. ఆంధ్ర పీఠమైన



గబ్బిట దుర్గాప్రసాద్

పుష్పగిరి శంకరాచార్యులు శ్రీ విద్యా నృసింహ భారతీస్వామి వారి ఆదేశంతో వారి ఉత్తరాధికారి, ప్రస్తుత పీఠాధిపతి శ్రీ విద్యా శంకర భారతీ స్వామివారికి తర్క వేదాంత శాస్త్రాలను కాశీలో శ్రీ శాస్త్రి గారి ఇంటి వద్దనే శ్రవణం చేయించారు. అనేక మంది పీఠాధిపతుల వద్ద గోలోకం, కాళీ శాంకరి, బాచ్యార్యూ "అద్వైత సిద్ధి, బ్రహ్మానందీయ క్రోడ పత్ర" విషయాలపై శాస్త్రార్థాలు చేసి జగద్గురువుల అనుగ్రహం పొందారు. కంచి, శృంగేరి, ద్వారక, పుష్పగిరి, ఉడిపి పీఠాలలో శాస్త్రార్థ చర్చ చేసి "శాస్త్ర విద్వన్మణి', "న్యాయ రత్న", "ఆర్షవిద్యా భూషణ" బిరుదులను అందుకున్నారు. శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారి ఆజ్ఞానుసారం మహా మహోపాధ్యాయ శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారి ఇంటిలో అంతేవాసిగా ఉండి తర్క వేదాంత శాస్త్రాలను ఆపోసన పట్టారు.

"న్యాయ విద్యా ప్రవీణ" మరియు "వేదాంతాచార్య" బిరుదులు శ్రీ ఆంజనేయ శాస్త్రి గారి న్యాయ, మీమాంస శాస్త్ర పాండిత్యానికి, వేదాంత ప్రతిభకు సార్ధకతను చేకూర్చాయి.

గీర్వాణ కవుల కవితా గీర్వాణం 2వ భాగం నుండి గ్రహింపబడినది.





తేశ్రోత్రియాస్తత్త్వ వినిశ్చయాయ
భూరిశృతం శాశ్వతమాద్రియంతే
ఇష్టాయ పూర్తాయచ కర్మణేర్థాన్
దారనపత్యాయ తపోఽర్థమాయుః - భవభూతిః














గబ్బిట దుర్గాప్రసాద్

